ప్రకటించబడవు

౧ వంచిరా ... తాగ ౦౮ వ్రుగ ఈ పం౨ని జాతసం॥ ... ౹౹౩ తాఖులు వార్త ప్రజా హాహాంర్యమునకు అనవసరమైన ... మూల కావున ప్రకటించబడదు.

౨ "గ్రామాధికారుల దుండగములు" అని చెన్నూ మాంగవరం నుండి ౯-౨-౧౩౪౫ న వ పంపబడినవార్త లోన ప్రజోపయోగము లు పుకోలేదు కొట్టి అవార్త ప్రకటించబడదు



గోలకొండ పత్రిక

ధాత నామ సం॥ జ్యేష్ఠ శు॥ ౧

గురువారము

## శ్రీ॥ శే॥ మో. రామచంద్ర రావుగారు

ఆంధ్రులలో నేడు, ఆంధ్రదేశమును దాటి పేరెన్నిక గలవారలు ఎందరో లేరు అట్టి అరుదైన ఆంధ్రజ్యోతులలో నొకరై వెలిగి, ఇపుడీభూమినుండి అదృశ్యులైన సర్ మోచర్ల రామచంద్రరావుపంతులుగారి అనంతవియోగమునకై ఏఆంధ్రుడు క్షణకాలముడీర్ఘ్యగ్నుడుకాక ఉండగలడు?

రామచంద్రరావుగారు చిరకాలము కాంగ్రెసు మృదుమార్గానుసారులచేనడుపబడుచున్నంతకాలము దానిలోనుండి, గాంధిమహాత్ముని నాయకత్వమున ౧౯౨౧ లో కాంగ్రెసు సహాయనిరాకరణోద్యమమును ఆమోదించుటతోడనే రావుగారు తక్కినమృదుమార్గానుసారులతోకూడ కాంగ్రెసును వదలిపోయి, అది మొదలుకొని లిబరలు పార్టీతో ఎక్కువసంబంధము గలిగియుండినది నిజము కాని దీనికారణము, అధమపక్షము రావుగారివిషయములోనైనను, అధైర్యమొక్కటయేయని తలచజాలము వారివివేచనలో, ఏమైనగా కూడ వెంటనే అంతతీక్ష్ణక్రియలవలన నట సాధించవలసిన అర్థమునకుభంగకరము కాగ అనిపించియుండవచ్చును అయినను అధైర్యముకూడ ఒకముఖ్యకారణమని ఒప్పుకొనక తప్పదు

అయితే ఈ అధైర్యముచే, వారియెడ దేశములకుగల గౌరవముతగ్గలేదు వారెందరు గొప్పగొప్పవారు కాంగ్రెసురంగములో తమనామధేయమును తళతళమెఱపించి, అందరను కన్నులు మిఱుమిట్లు గొలుపునంతలో శత్రుపక్షమున గొప్పజీతములుగల అధికారపదముల చేరియుండ, రామచంద్రరావుగారు కాంగ్రెసురంగమును వదలినది అట్టిస్వార్థము కొఱకై కాదు. పలువురు మొదటకాంగ్రెసు రంగమున మెఱపు మెఱపించిన వారలు, స్వార్థము పట్టించగనే, ఆరంగమును వదలుటయేగాక, పైగా స్వార్థము కొఱకై కాంగ్రెసు నిడుములపెట్టుటకుకూడ అంగీకరించిరి ఇట్టి పద్ధతికి రామచంద్రరావుగారు ఒడంబడినవారుకారు లేనిచో కాంగ్రెసునుండి చాలించుకొని నతర్వాత, చిత్తరంజనదాసుగారి నాయకత్వమున కాంగ్రెసు తీక్ష్ణమార్గమును వదలి శాసనసభలలో పనికి అంగీకరించిన తర్వాత, కాంగ్రెసు కేంద్ర శాసనసభలలో స్థానమునకు పోటీచేసియుండరా? వారు ప్రభుత్వమునే ఖుషామదు చేసియుండినచో వారికి గొప్పఅనేకొలస్థానము లభించియేయుండును ౧౯౨౧ లో వారు మదరాసుప్రభుత్వ కార్యనిర్వాహకవర్గమున నౌకరుగా నియమించబడబోయియు, తుదకు నియమించబడకుండుటకు, వారు ఒక్కనీతికిబద్ధులై మిత్రులఉపదేశమును విని గవర్నరుగారిని దర్శించకపోవుటయే కారణమైయుండును ఆఖరుకువారు తమఅధైర్యమునకు మెఱుగుపూతపూసికొనుటకుగాని పూయించుకొనుటకుగాని శ్రద్ధవహించలేదు ఇట్టినిర్వక్రమైన ఋజుబుద్ధి వారిఅధైర్యమును వారిగౌరవమును మాపకుండ పోషించినది

పంతులుగారు కాంగ్రెసునువదలి, అదృష్టము వరించినప్పుడుకూడ, ప్రజాహితపరులను ఏదేని యొకకారణముచే బాధించవలసి వచ్చునను భయముతో గొప్పఅధికారపదముల నెక్కకుండుట వారినీతిబద్ధతనేగాక, వారిప్రజాహితాభిలాషను పరహితాచరణయందు భిన్నాభిప్రాయులయెడ గౌరవబుద్ధినికూడ సూచించును పంతులుగారు న్యాయవాదివృత్తిచే గొప్ప ఆదాయమును పొందుచుండియు, నానాటికి ప్రజాహితాచరణాభిలాష ఎక్కువగుట చేతనే, క్రమక్రమముగా వృత్తికివినియోగించవలసిన కాలమును, శ్రద్ధను ప్రజాహితవిషయముల వైపు ఎక్కువ జేయుచుండిరి. వారెక్కువ దానధర్మములుచేసినట్లు వేరువినబడదుకాని, మంచిఆదాయము నిచ్చుచుండిన న్యాయవాదివృత్తియందు శ్రద్ధను క్రమక్రమముగ తగ్గించిఆదాయముతేలికపనులకై వినియోగించియుండుట, వారు ఏధియును తలంపుతోగాక అపనులయందు అభిరుచితోనే జేసియున్నను, త్యాగము కాజాలదా!

అయితే వారిసౌజన్యము, సౌశీల్యము వారిధైర్యలోపమును, దీర్ఘసూత్రత్వమును మంచివేయుటకు ఉపయోగించినవేకాని, వారి నిఖిలభరతఖండవ్యాప్తముగు కీర్తిస్ఫూర్తి నానావిధప్రజాహిత విషయములనుగూర్చిన ఆలోచనలయందు విషయమును సంపూర్ణముగ అవగాహనచేసికొని ఎదుటవారికి బోధపరచి, ఎంతోదూరమాలోచించిన తర్వాత తమకు కుదిరినని్ర్ణయముదెస ఎదుటివారల నాకర్షించగలశక్తియే మూలము తమవాగ్ధరిచే ఇతరులను సమ్మోహింపజేయగలశక్తి వారివద్ద లేదు వారిఆకృతి యందును గొప్పఆకర్షణ ఏమియులేదు. కాని ఏవిషయమునుగూర్చిన చర్చలోగాని మద్రాసురాష్ట్ర శాసనసభలోనేమి, భారతశాసనసభయగు అసెంబ్లీలోనేమి, ఇతరజానపదసభలలోనేమి వారిఉపన్యాసమును అందరును నిశ్శబ్దముతో వినువారు, ఏలయన అసలుపరిష్కరించదగిన సమస్యయొక్క పూర్వాపరములును పూర్వపక్షసిద్ధాంతములను వారు అంతసమగ్రముగ చిక్కులవిడదీసి బోధించెడివారు. విద్యావిషయములందును ఆర్థిక విషయములందును, సైనికవిషయములందును, వడ్డీవ్యాపారపువిషయములందును, రాజ్యాంగ విషయములందును వారిసమగ్రవిజ్ఞానము వలని లాభమునుపొందుటకే వారు సీకమిటీ, సాంఘర్స్టుకమిటీ, రౌండుటేబల్ కాన్ఫరెన్సు, లిట్టనుకమిటీ, రిజర్వు బ్యాంకు—నీటియందు ఆలోచనచెప్పుటకై గ్రహించబడినది ఈకమిటీలయందు వారెంతో సేవచేసిరి

ఆంధ్రులందరును స్వరాజ్యోద్యమములో మునిగియుండి, ఆంధ్రరాష్ట్రసాధనకై పంతులుగారి సేవను ఉపయోగించుకొనగలఅదృష్టము లేకపోయెనుగాని, లేనిచో ఆయుద్యమమునకు నాయకులై తగియుండినవారు ఒకప్పుడు సంస్థానప్రజా మహాసభకుఅధ్యక్షులై ఆప్రజలతరఫున వారలకష్టములను బ్రిటిషుప్రభుత్వమువారికి తెలియబరచుటకై వారునడిపించినరాయబారముసంస్థానప్రజలుమరువరు కాని వారివిశేషమేమన వారి అవసానమునకు ముందుజబ్బుపడినపుడు మైసూరుసంస్థాన ప్రభుత్వమువారు వారిచికిత్సకై ఎంతో సౌకర్యముకలిగించిరి.

రామచంద్రరావుగారికి నాయకుడుగా శోభించుటకు వలయుసాహసము, సమ్మోహనవాగ్ధాటి లోపించినవి వారిదీర్ఘసూత్రిత్వము అందుకు ఆటంకమైన ఒక లోపము. కాని ఈప్రపంచమందు, పరోపకారరంగమందు వారికి తగిన గొప్పస్థానము లేకపోలేదు రాజు గాకున్నచో రాజపూజితుడైన విద్యాధికుడును, వివేకియు, విశ్వసనీయుడును నగు మంత్రియొక్కస్థానము వారిది



## హైదరాబాదు "లలితకళోపాసకసమితి"

స్థాపనోత్సవము

సంగీతాభినయముల పోటి

ఈమాసాంతమున హైదరాబాదు నగరమున జరుగబోవు లలిత కళోపాసకసమితి స్థాపనోత్సవ సందర్భమున కళోపాసకులను ప్రజలకుపరిచయము గలిగించు నుద్దేశముతో సంగితమునందును, అభినయమునందును ఈక్రిందివిషయములలో పోటీలు ఏర్పాటుచేయబడినవి

1 గానము (vocal)
2, వాద్యము (Instrumental)
3 ఏకపాత్రాభినయము (Monoacting)
4 వివిధరంగముల ప్రదర్శనము (Variety scences)

వీనిలో ఒక్కొక్కవానియందు అత్యుత్తములుగ నిర్ణయింపబడువారు సమితిచే బహుమానములతో సత్కరింపబడుదురు ఇందు స్త్రీపురుషభేదములులేక అందరును పాల్గొనవచ్చును

ఇందు పాల్గొనదలచిన ప్రత్యేకవ్యక్తియు రంగమును ప్రదర్శించు సంఘమును తాము ప్రదర్శించబోవు విషయమును తెలుపుచు రూ 2 ప్రవేశరుసుముతో 30 మేవరకు తమ కోరికను వ్రాతమూలకముగ సమితి కార్యదర్శికి తెలియజేయవలెను వివరములు కార్యదర్శివల్ల తెలుసుకొనవచ్చును లలిత కళోపాసకులందరును ఈ సందర్భమును వినియోగించుకొని ప్రజలలో కళాసక్తిని పెంపొందజేయుటకై తోడ్పడుదురని ఆశించుచున్నాము

ఇట్లు, కార్యదర్శి
లలితకళోపాసక సంఘము

C/o గో॥ గ్రంథపాలకుడు శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము సుల్తానుబజారు హైద్రాబాదు దక్కన్

## రక్షక శాఖాధికారుల యూనిఫారము

రక్షక శాఖాధికారుల యూనిఫారంగునుబడులు మార్కెట్టుట పరిశీలించుచున్నదని తెలియుచున్నది

# రాఘవేంద్రరావు గాంధి టోపీతో గవర్నరు పీఠమెక్కుట

పచ్మార్హి, మే ౧౭:—

మధ్యరాష్ట్ర ప్రభుత్వపు హోం మెంబరుఆగు గౌ॥ ఇ. రాఘవేంద్రరావుగారు నేటి ఉదయము ౯౪ గంటలకు గవర్నరుపీఠమును అధిష్ఠించిరి. ప్రభుత్వభవనమున బాల్‌రూములో పైఉత్సవము జరిగెను. అధికారులు అనధికారులు ప్రముఖులు పలువురువచ్చిరి.

గౌ॥ రావుగారు ఎప్పటివలెనే ఖద్దరు దుస్తులధరించి, గాంధిటోపీపెట్టుకొని ఉదయము ౯ గంటలకు బాల్‌రూములో ప్రవేశించిరి. వీరితోపాటు పరివారముగూడి వచ్చెను. వీరు తమస్థానమును అలంకరించిన తర్వాత ప్రధాన కార్యదర్శి ఎ. యల్. బిన్నిగారు గవర్నరుగ రెండ్రుకోలము నియమించినట్లు దెలుపు పత్రమును చదివిరి. "రాయల్ సైన్ మాన్యుయల్" ననుసరించి గవర్నరుగా నియమింపబడినను ఖద్దరుగుడ్డలనువదలనివారిలో వీరేమొదటివారు. రాఘవేంద్రరావుగారిచే రాజభక్తి ప్రమాణమును చేయించిరి. గవర్నరు కార్యనిర్వాహకసంఘమున యాకా. జె. రౌటన్ సి.ఐ.ఇ.గారిని తాత్కాలిక సభ్యులుగా నియమించినటుల ప్రధాన కార్యదర్శి ప్రకటించిరి. అంతటితో సభ ముగిసెను. గవర్నరు ఉద్యోగ పీఠమును అలంకరించినటుల అందరికి తెలియజేయుటకుగాను సీతబల్డి, నాగపూరు కోటలలో ౧౭ ఫిరంగులను ప్రేల్చిరి.

రాఘవేంద్రరావుగారి అనుభవము

రాఘవేంద్రరావుగారికి పరిపాలనా కార్యనిర్వహణమున ఎక్కువ అనుభవము గలదు. హోంమెంబరు కాకపూర్వము వీరు వివిధశాఖల మంత్రులుగా పనిచేసియుండిరి. వీరు ఆంధ్రులు. ఇంకొకనెలలో ఆంధ్రుడగు గౌ॥ సర్ కూర్మా వెంకటరెడ్డిగారుగూడ గవర్నరు స్థానమలంకరించెదరు. మాంటుఫర్డు రిఫారమ్సులో మధ్యరాష్ట్రమున భారతీయుడు జాతీయవాది గవర్నరుస్థానము అలంకరించుట కిది రెండవసారి.

(యు. ప్రె)

---

## దసరాపండుగకై ఉంచిన తుపాకికి లైసెన్సులేదని శిక్ష

గంగారామనువతడు రైల్వే గ్యాంగుమన్. ఇతనివయి రైల్వేరక్షకశాఖవారు లైసెన్సులేని తుపాకి యుంచుకొనియున్నాడను నేరము మోపిరి. విచారణలో తుపాకియున్నట్లు బయటపడెను. కాని నేరస్థుడు "నాకడ తుపాకియున్నది వాస్తవమే. కానిదానిని ఆయుధముగా వాడను. దసరాపండుగకు పూజచేయుటకై యుంచినానని చెప్పెను. కాని మిస్టర్ పి జె. ఆండర్సన్‌గారు [నిజాంరైల్వే మొదటితరగతి న్యాయాధికారి] హైదరాబాదు రైల్వే ఆయుధశాసనము ప్రకారము ౧౦గారామునకు రూ. ౩౦ లు జుర్మానా. చెల్లించనియెడల ౧ నెల శిక్ష విధించిరి. నేరస్థునిపక్షమున శ్రీయుత బాజీ కృష్ణారావుగారు, బి. ఏ. బి. ఎల్. గారు రక్షకశాఖపక్షమున మిస్టర్ అయ్యంగారు ఇన్స్పెక్టరు వాదించిరి.

---



డోంగ్రేగారి
బాలామృతము

విన్న... ముఖ్య... (left masthead box, illegible)

# గోలకొండపత్రిక

GOLKONDA PATRIKA
HYDERABAD DECCAN
The First Telugu Bi Weekly in Andhra Desa and the only Telugu Newspaper for H E H The Nizam's Dominions

వ... లకు
నిజాంరాష్ట్ర ఎనిమి
జిల్లాలలో ఆంధ్రుల
లో మీ ... వృద్ధికి
సాధనము? గోలకొండ
... లో ప్రకటనము

Vol 11 | Monday 15—6—1936 | No 11


# రూ. ౪౦౦౦౦ ల స్నానమందిరము

## భారియా మహారాజుగారి మహేంద్ర భోగములు

గుజరాత సంస్థానముల ఏజన్సీలో గవర్నరు జనరల్ గారి ఏజంటుద్వారా ఇండియా ప్రభుత్వముతో నేరుగా సంబంధముగల భారియా అను సంస్థాన మొకటికలదు. ఇది పూర్వపు రేవాకంఠములో ఒక సామంత సంస్థానము. దీని విస్తీర్ణము ౮౧౩ మైళ్లు జనసంఖ్య ౧౪౯౪౨౯. సం॥ ౧ కి రూ. ౧౧౪౦౦౦ ఆదాయము, రూ. ౧౩౯౭౦౦౦ వ్యయముగలదు ఈసంస్థాన ప్రభువుకు శాశ్వతముగా ౯ తోపుల గౌరవముగలదు. రాజుపేరు శ్రీ సర్ రంజిత్ సింహజీ, వీరు ౧ మే ౧౯౧౩ నాడు అప్పట్లో బొంబాయి గవర్నరుగనుండిన లార్డ్ విలింగ్టన్ గారికి యైడ్ డికాంపుగ నియోజించబడిరి. వీరు ౧౮౮౬ లో పుట్టి, ౧౯౦౮ ఫిబ్రవరిలో సింహాసనమెక్కిరి. వీరిరాజ్యములో ౩౦౦౦ మంది ముసల్మానులు తప్పతక్కిన వారందరును హిందువులైనిబిల్లులు, కోలీలు నాయక్ దార్లును నైయున్నారు. ఈరాజ్యములో ఎక్కువభాగము అడవులతో నిండినది. అయిదవవంతు భూమి సేద్యమగును. కట్టె, మొక్కజొన్న. కొయ ధాన్యములు, గోధుమలు పండును. ఒరియాసంస్థానము బొంబాయి రాజధానిలోని పంచమహాల్ జిల్లాకు అనుకొనియుండును.

ఇప్పుడు ఈసంస్థానపు రాజు తనకోటలో స్వరసౌఖ్యములను కల్పించదలచి, అందుకై బ్రహ్మాండమైన ఏర్పాట్లను గావించినాడు. కోటను పెంచినాడు. రాజభవనములో స్నానమునకై ౪౦ వేల రూపాయలు ఖర్చుచేసి ఒకగది కట్టించినాడు ఈస్నాన మందిర నిర్మాణమునకై ఇంగ్లాండునుంచి లాడ్ అనునతనిని పిలిపించెనట' ఈ స్నానగృహములో నేల అంతయు ఒకచిత్రమైన అద్దములతో పరవబడినది. ఆఅద్దములక్రింద దీపములు పెట్టబడినవట. దీపముల కాంతిలో ఆఅద్దములలోనుండిఒక సరస్సు సరస్సులో చేపలు కనబడుచుండునట, ఈ వైభోగమునుగురించి "ప్రజాబంధు" "ఎక్కడో ఇంద్రలోకములో దేవతలు సౌఖ్యాలు అనుభవిస్తారని అంటారుకాని ఇక్కడ ఇండియాలో జమీందారులు, రాజులు, మహారాజులు, ఆయాశలన్నీతీర్చుకొంటూ వుంటారు." అని వ్రాసినది.

---

# సర్ మోచర్ల రామచంద్ర రావు పంతులుగారు

శ్రీయుత నందగిరి వెంకటరావుగారు

(ఈత్రింశస్తుని ది॥ సర్ మోచర్ల రామచంద్రరావుగారికై విషాదమును తెల్పుటకై హైద్రాబాదునగరమున కృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయములో హైద్రాబాదు ఆంధ్రజన సంఘ యాజమాన్యమున జరిగినసభలో నందగిరి వెంకట్రావుగారిచే చదువబడినది ఇందు, జీవితచరిత్రకు సంబంధించినభాగము ఈపత్రికలో పునరుక్తియగునని వదలబడినది,)

శనివారం. సాయంత్రం. నాలుగు... బెంగుళూరిలోని వొహచిన్నయింట్లో ... లోలంగావుంది. తెల్లముఖాల్లో ... గూడారు. పాపం ఆంధ్రులకివోష ... సిందన్నారు. కేవలం ఆంధ్రప్ర... అరవైయొనమిదేళ్లవృద్ధుడు సర్ ... చంద్రరావుపంతులు, ఆయ... ర్యింపవలసిన తెనుగుబిడ్డ... సర్ మోచర్లవారు ... కం, బంగారు... పేరు ఆల... కంటే ...

పండితుడిమృదుమధురవక్తృత్వానికివుంది ఎంటివిషమఘటనతటస్థించినా నిమిషంసేపైనా అతలోచించకుండా టక్కుటక్కునచదరంగం నడిపినట్టు వ్యవహారంతేల్చగల సమయోచితబుద్ధి పట్టాభికివుంది. కాని సర్ మోచర్లకను పేర. ఇవేవిఅయనకులేవు. అందుకనే ప్రజాబాహుళ్యాన్ని ఆకర్షించలేకపోయినాడు. కాని యెంత చిక్కుఅయినాయివ్వండి కంటికద్దాలు పెట్టుకొని విసుగులేక. విరతలేక ఓపికతోఒక్కపోగు తెగకుండా సాపీగావిడదీసి పెట్టగలడు ఆగ, న్యాయరాజకీయశాస్త్రాల్లో కొరుకుపడనికొయ్యలను చేజిక్కించుకొన్నవాడు. కాబట్టి పైవిషయాల్లోని ముఖ్యచర్చల్లో ఆయనవుండక తప్పిందికాదు. నాయకుడినిజబలం అతని మంత్రివర్గం. గుప్తంగావుండే మంత్రివర్గానికి అయుధంనాయకుడు. ఆయునదిగ్విజయ గౌరవం దాన్నినడిపించేహస్తరాజంది. మనఆంధ్రనాయ... ప్రసక్తి మనననాయకులకు మంత్రిస్తూవుండి ... ర్ మోచర్లది మనరామచంద్రరావుతో చె... కగినవాడు వంగదేశానికి రమేశచంద్రు... డే. మహారాష్ట్రానికి గోఖలేవొక్కడే.

... లో, మైలాపూరులో ఎద్వర్డు ఎ... ట్రాంషెడువుంది. కే. శే. పేరి... గారి నారాయణకేజిల్ అ... ంటుంది మిట్టమధ్యాహ్నం ... కేజిల్ పక్కనుంచివొ స్తా... కొద్దిగాల ... ంటిశరీ... ', అ... కట్టి ... పో ...

---

# చేతిపనులు

## కొన్ని అనుభవ యోగములు

౧. పరిమళసబ్బులు చేయువిధము -ప్రయోగము

కాస్టికుసోడా ౯౭ డిగ్రి

| | | |
|---|---|---|
| మార్కుగలది | ౧ | శేరు |
| తేట మంచినీరు | ౧ ౺ | శేరు |
| కొబ్బరినూనె | ౫ ౺ | శేర్లు |
| రంగు | | తగుపాటి |

సువాసన ఎసన్సు--తగుపాటి కొన్నిచుక్కలు

(ఎసన్సులలో జాస్మిన్, రోజు, సిట్రన్ వీటిలో ఏదైననుమిశ్రమము చేయవచ్చును. సబ్బు సిద్ధము చేయుటకుముందు ౧౨ ఘంటలకు మొదట కాస్టికుసోడాను నీటిలో కరిగించుకొనియుంచేది. పిమ్మట ఆనీటిని వడపోశికొని కాగి చల్లారిన కొబ్బరినూనెపై కాస్టికుసోడా నీటిలో ధారగాపోయుచు ఒకకొయ్యతెడ్డుతో బాగుగా కలుపుకొనవలయును, అప్పై తేనెమాదిరి చిక్కబడిన వెంటనే సబ్బులకు సంబంధించిన రంగును తగువాటిని కలుపుకొని అవసరపూర్తిగ సువాసన ఎసన్సు కొన్నిచుక్కలు విడిచి నూనె రాచియుంచిన సాంచాలలోగాని వెడల్పాటి టిన్ డబ్బాలలోగాని పోశియుంచి ౨౪ ఘంటలవరకు నీడవ ఎండించి అపైవాడుకొనవచ్చును. ఇదేప్రకారము పై పాళమును బట్టి వస్తువులను తగ్గించి సిద్ధపర్చుకొనవచ్చును.

౨. రబ్బర్ ముద్రల యింకుచేయువిధము

౧ అవున్సు గ్లిసరిన్ లో ఏరంగు అవసరమో అట్టిరంగు ౦-౧-౦ భాగము ౧ తులములో మిశ్రమపర్చి వాడుకొనేది ౧ అవున్సు ప్రమాణము. ౨ ౺ తులము.

౩. దంతధావన చూర్ణము చేయువిధము

| | |
|---|---|
| ౧. వస్త్రకాలితము చేసిన శుభ్రమైన సీమసున్నపు పొడి | ౧౦ తులములు |
| ౨. పటికపొడి | ౨ తులములు |
| ౩. లవంగముల పొడి | పావుతులము |
| ౪. పారశీకర్పూరము | పావు తులము |
| ౫. నీలగిరియూకలిప్టస్ తైలము | ౪ తులము |

పై చూర్ణములన్ని వేరువేరుగానూరి ఒకచో మిశ్రమపర్చిపిమ్మట యూకలిప్టస్ తైలము కలుపుకొని వాడేది.

౪. పరిమళ తాంబూలపు వక్కలు చేయువిధము

| | |
|---|---|
| మేలైన పటీన్ చికినీవక్కలు | ౧ శేరు |
| ఏలకులు | ౫ తులములు |
| లవంగాలు | ౫ తులములు |
| జాజికాయ | ౨ తులములు |
| గసాల | ౩ తులములు |
| పచ్చకర్పూరము | ౧ తులము |
| కుంకుమపూవు | ౧ తులము |
| అంబరు | ౫ చుక్కలు |

వక్కలు ముక్కముక్కలుగా కత్తిరించి తక్కినదినుసులు మెత్తగా చూర్ణించి మిశ్రమపర్చి పిమ్మట అంబరు సువాసనచుక్కలు విడిచి టిన్ డబ్బాలలోయుంచుకొని వాడుకొనేది.

(పరోపకారార్థమై అపుడపుడు నేను గోలకొండపత్రికా మూలమున నాయనుభవసిద్ధ చేతిపనులయోగములను వెల్లడిపర్చ దలంచితిని. పాఠకులు శిద్ధపర్చుకొని తెలియని విషయములనుమరియు యోగమునకు సంబంధించిన దినుసులు ఎక్కడచిక్కునదియు వివరముగా దెలుపనవును. వలయువారు ఈక్రిందిఅడ్రెసునకు ఉత్తర ప్రత్యుత్తరముల ద్వారా తెలిశికొనవచ్చును. ఇవిగాక గృహవైద్యమునకు సంబంధించిన యోగములనుగూడపత్రికా మూలమున ప్రకటించలచితిని.)

ఇట్లు
సంతపురి రామకృష్ణారావు
ఎస్. వీరరాఘవాలయము
హనుమకొండ (వరంగల్)
నైజాం.

---

గాముడుతలుబడ్డ ఆపండు ముఖంయొక్కశాంతి. ఆక్కడున్నవాళ్లు ప్రక్కకితొలగి నమస్కారాలు చేసారు. పెదబ్రాహ్మణిటావాళ్లతో కుశల ప్రశ్న చేసా డా య న.వాళ్లు కొత్తవాళ్లతో చిన్నగాచెప్పుకున్నారు "మోచర్లవాడు" ఎన్నోగౌరవోద్యోగాలుచేసి అఖిలభారత ప్రఖ్యాతిబడిసి మున్మారుఇంగ్లాండుకి వెళ్లివొచ్చి బిరుదాంకితులైన మోచర్లరామచంద్రరావుగారే యీవ్యక్తిఅని విశ్వసించేవారుతక్కువ.

గులాబి కంపలో వున్నాగులాబీ!

భారతీయులకు ప్రత్యేకంగామనకు వొహపెద్దమన్నిపోయినాడు. ఉద్రేకంలోవున్నప్పుడి మనల్నిశాంతపరచి సలహాచెప్పేపెద్ద దిక్కుహాటిపోయింది అటాం పెడుదగ్గిర అవ్యక్తియిహఅవుపడడు. ఆపండుముఖం యీమాయప్రపంచంలోంచి మాయమైపోయింది. వారి ఆప్తులకు మనశాంతికలుగుగాక!

"వీరమణిహారమందున
రత్నమొక్కటి జారిపోయెను
నింగివెలిగెడి చుక్కలందున
కొత్తగానొక తెనుగుచుక్కగ
మెరిసిపోయెనుగా"

---

# ఎక్సెల్సియరు పాఠశాల

ఉస్మానుగంజువద్ద. హైద్రాబాదు

## ఆంధ్రులకు విద్యాసౌకర్యము కలదు

ప్రైమరీ మిడిలు పాఠశాలలోనే మాతృభాషద్వారా విద్య చాల అవసరము. అట్టి యవసరాన్ని పైపాఠశాల తీర్చుచున్నది. మిడిల్ వరకు తరగతులు కలవు. తెనుగులో నేర్పింతురు. ఇంగ్లీషు ఉర్దూకు ప్రత్యేకం ఏర్పాట్లు కలవు. ప్రైమరీలో విద్య ఇంచుమించు ఉచితమే. పైమూడు ఫారములలోను జీతములు చాల తక్కువ. ఉపాధ్యాయులు ప్రత్యేకంగా శ్రద్ధతీసికొని పాఠముల చెప్పుచున్నారు. ఈ సంవత్సరము మిడిలుపరీక్షకు పోయిన ౧౨మంది విద్యార్థులలో ౯మంది పరీక్షలో కడతేరినారు. ఇది చాలా ప్రశంసనీయమైనవిషయము. బాలుర యజమానులు నెలనెలకు తమ పిల్లల స్థితిగతులను హెడ్ మాస్టరు ద్వారా తెలుసుకొనవచ్చును. పాఠశాలలోని తరగతులు నెలవులై పోయినందున ప్రారంభించినారు. నగరములోని ఆంధ్రులును జిల్లాలవారును ఈపాఠశాలకు తమబాలుర పంపిన చాల లాభకరముగా నుండును.

ఇట్లు
ఒక విలేఖరి.


...da Power Press Hyderabad. Editor K. Balakrishna Reddy.